# ఉత్తరం

( రవీంద్రనాథ ఠాకూరు )

~~రూ౧౦ ౩౨-౪~~

-1-57



సి. వి. రావు పబ్లికేషన్సు

పాత గుంటూరు.

# ఉత్తరం

(నాటిక)



మూలం:

రవీంద్రనాథ్ టాగూరు

అనువాదం:

అక్కిరాజు అప్పారావు

వెల 0—8—0

# — పాత్రలు —

మాధవ్

అమల్

సుధ

ఠాకూర్

పాలమనిషి

గస్తీమనిషి

తాత (సాధువు)

పంచానన్ (గ్రామ పెద్ద)

రాజదూత

రాజవైద్యుడు



# ఉత్తరం



మాధవ్:- దుర్భరం డాక్టరుగారూ! నేనతన్ని గాఢంగా ప్రేమి
స్తున్నాను. ఇప్పుడతడు లేకపోతే నాయిల్లు కళ తప్పి
పోతుంది...విూరు...

డాక్టర్:- బ్రతికే రాత ఉంటే బ్రతుకుతాడు, కాని వైద్యశా
స్త్రాల్లో ఏమున్నదంటే...బహుశా...

మాధవ్:- ఏమిటి డాక్టరుగారూ?...

డా॥ శాస్త్రాల్లో యిలాఉంది-పైత్యం, వాతం, జలుబు, జ్వరం
మొదలైనవి...

మా॥ దయచేసి శాస్త్రాలు చాలించండి - నాఆదుర్దా నెక్కు
చేస్తున్నారు - నేనేం చేయ్యాలో చెప్పండి!

డా॥ రోగికి జాగ్రత్త అత్యవసరం!...

మా॥ అదినిజమే!...కాని నేనేంచెయ్యాలో చెప్పండి!

డా॥ నేనిదివరకే చెప్పానుగా...ఎలాంటి పరిస్థితిలోనూ అతడ
బయటికి పోగూడదు.

మా॥ అయ్యయ్యో! బొత్తిగా పసివాడు - పొద్దుగూకులూ
అతణ్ణి ఉంచడం అసాధ్యం...

డా॥ మరింకేం చేస్తావయ్యా నీవు! పసివాడికి ఎండా, తేమా - రెండూ పనికిరావు - శాస్త్రాల్లో ఏముందంటే ... మూర్ఛ మొదలైన...

మా॥ అబ్బబ్బ! శాస్త్రాలు చాలించండి - అతణ్ణి యింట్లో బంధించడం తప్ప వేరేమార్గంలేదా డాక్టరుగారూ!...

డా॥ లేదు - ఎందువల్లనంటే - గాలిలోనూ ఎండలోనూ...

మా॥ దానిలోనూ దీనిలోనూ ఏమిటండీ - అదేదో సరిగా చెప్పండి - బయటికి పోకుండా ఉండడం పిల్లవాడికి ప్రాణకంటకం - ఇప్పటికే చాల బాధపడుతున్నాడు- మీమందు త్రాగేటప్పుడు అతని బాధ చూస్తుంటే నాగుండె నీరౌతుంది.

మా॥ బాధపడితేనే ఫలితం దక్కుతుంది - "మంచి సలహాసలె మందుకూడ మనసుకునచ్చినదైతేనే మేలు చేస్తుంది" అన్నాడు చ్యవనమహర్షి - అది అక్షరాలా నిజం... ఆఁ! నేను త్వరగా వెళ్లాలి. (వెళ్ళును)

(ప్రవేశం - తాత)

మా॥ ఈ బాధకుతోడు నీవూ తయారయ్యావా!...

తా॥ నేను నిన్నేమి కొరుక్కుతిననులే-

మా॥ నీవా - నీవు పసిపిల్లలపాలిటి రాక్షసుడవు...

తా॥ నీవా పిల్లవాడివికావు - నీయింట్లో పిల్లలాలేరు - మరి నీ కెందుకూ భయం!...

మా॥ నీకు తెలియదేం? నేనొక పిల్లవాణ్ణి తెచ్చుకున్నాను!...

తా॥ నిజం!... ఎప్పుడూ!...

మా॥ ఎవరినైనా పిల్లవాడిని పెంచుకోవాలని నాభార్య ఎంత ముచ్చటపడేదో నీకు తెలుసుకదూ!...

తా॥ అది చాలకాలం క్రిందటిసంగతి- కాని నీకిష్టంలేదుగా!...

మా॥ అవుననుకో - డబ్బు సంపాదించడం అనేది చాల కష్టమయినపని - అలాంటి డబ్బును ఎవడో ఒకడు వచ్చి వ్యర్థంగా ఖర్చు బెట్టడం నాకిష్టంలేదు - అయినా - యీపిల్లవాడు నామనస్సు దోచుకున్నాడు...

తా॥ ఆం! అట్లా చెప్పు! ఇప్పుడు నీడబ్బంతా ఖర్చయిపోయినా నీకు సంతోషమే...

మా॥ అవును - ఇదివరకు డబ్బుసంపాదించడమనేది నాకొక అలవాటు మాత్రమే - కాని యీ పిల్లవాడికోసం సంపాదించడమంటే నాకు సంతోషంగా కూడా ఉంది...

తా॥ ఊం! బాగానేఉంది! ఎవరిపిల్లవాడు ?

మా॥ నా భార్య సోదరునికొడుకు- చిన్నప్పటినుండి తల్లిలేదు- మొన్నమొన్ననే తండ్రికూడా పోయాడు...

తా॥ పాపం! అయితే అతనికి నా అవసరం చాలాఉంది...

మా॥ ఈ చలికాలంలో, బయట తిరక్కుండా జాగ్రత్తపడితే తప్ప పిల్లవాడు బ్రతికే ఆశలేదని డాక్టరు చెప్పాడు!

ఈ వయస్సులోకూడా పిల్లల్ని బయట తిప్పడమేగా నీపని !

తా॥ బాగుంది! అయితే నేను చలికాలపు వాతావరణ మంత పనికిరానివాడిననంటావ్... నాకు పిల్లల్ని యింట్లోనే ఆడించడంకూడా తెలుసు – నా పని కాగానే మీ అబ్బాయితో ఆడుకోడానికి వస్తాను... (వెళ్లును)

(ప్రవేశం – అమల్)

అ॥ మావయ్యా!... మావయ్యా!...

మా॥ ఓ! నీవా అమల్ రా...

అ॥ నేను బయటికి పోగూడదా ?

మా॥ వద్దు బాబూ వద్దు.

అ॥ చూడు...అక్కడ అత్త ధాన్యం బాగుచేస్తుంటే ఉడుత తన చిన్నముచ్చటైన చేతుల్తో గింజలేరుకొని ఎలా ఎలా ఓలుచుకుని తింటుందో నేనక్కడికి పోగూడదా మావయ్యా ?

మా॥ వద్దు బాబూ వద్దు.

అ॥ నేనుకూడా ఉడుతనైతే ఎంతబాగుంటుంది. నన్నెందుకు బయటికి పోనియ్యవ్ మావయ్యా?

మా॥ బయటికిపోతే ప్రమాదమని డాక్టరు చెప్పాడు బాబూ.

అ॥ డాక్టర్ కెలా తెలుసు ?

మా॥ భలేవాడివి... పెద్ద పెద్ద పుస్తకాలు చదివే డాక్టరు కామాత్రం తెలియదూ.

అ॥ చదువుకుంటే అన్ని విషయాలు తెలుస్తాయా ?

మా॥ అవును బాబూ,

అ॥ అయితే నేను వట్టి మూర్ఖుణ్ణి... నేను చదువలేనుగా.

మా॥ బాగా చదువుకున్న వాళ్ళంతా నీలాగానే బయటికి వెళ్ళరు బాబూ,

అ॥ నిజమేనా ?...

మా॥ ఆఁ! పొద్దున్న లేస్తే వాళ్ళదృష్టిఅంతా చదువుమీదనే ఉంటుంది. నీవూ పెద్దవాడివైతే ఎప్పుడూ చదువు కుంటూ యింట్లోనే ఉంటావు – అప్పుడు ప్రజలంతా నిన్ను గొప్పవాడంటారు.

అ॥ అయితే నాకు చదువుకోవాలని లేదు. నేనుచదువుకోను– దానికంటే హాయిగా, స్వేచ్ఛగా ఎక్కడెక్కడికో తిరిగి అన్నీ చూస్తాను మావయ్యా.

మా॥ చూస్తావా ?... ఏముంది బాబూ బయట చూడ్డానికి?

అ॥ కిటికీలోనుంచి దూరాన్న ఉన్న ఆ కొండల్ని చూడు. హాయిగా వాటిపైకి వెళ్లాలని నే నెప్పుడూ అనుకుం టుంటాను.

మా॥ ఊరికినే వాటిపైకి వెళ్ళడమా. అబ్బే! నీవు చెప్పేదాని కేమీ అర్థంలేదు బాబూ. చూడు; ఆ కొండ లంత

యెత్తుగా ఉన్నాయంటే వాటిని ఎవరూ దాటి వెళ్ళ లేరన్నమాట... అయినా ఎందుకంత కష్టపడాలి?

అ॥ కేవలం మనల్ని నిరోధించడానికే కొండలంత ఎత్తుగా ఉన్నాయని నీ ఉద్దేశ్యమా మావయ్యా? నాకలా అనిపించడంలేదు, భూమికి మాట్లాడే శక్తిలేక చేతుల్ని ఆకాశంలోకెత్తి ఏవో సంజ్ఞలు చేస్తుందేమో ననిపిస్తుంది - ఒంటరిగా వాటిదాపుల్లో తిరిగేవాళ్లు ఆ సంజ్ఞల అర్థాన్ని తెలుసుకుంటుంటారు - కాని చదువుకున్నవాళ్లు...

మా॥ అవును - చదువుకున్నవాళ్లు యీ పిచ్చిపిచ్చి ఆలోచనలతో కాలాన్ని వృథా చేయరు - వాళ్లు నీలాంటి పిచ్చివాళ్లు కారు-

అ॥ నిన్న నాలాంటి పిచ్చివాణ్ణి ఒకరిని చూచాను, భుజం మీద కర్ర- కర్రకుచివర ఒకమూట - ఎడమచేతిలో చెంబు - కాళ్ళకు చిరిగిపోయిన చెప్పులుగా ఉన్నాయ్- అదుగో చూడు ఆ మైదానంలో నుంచి కొండవైపుకు పోతున్నాడు - అతణ్ణి పిలిచి "ఎక్కడికి వెళ్తున్నావ"ని అడిగాను - "నాకే తెలియదు" అన్నాడు- "ఎందుకు వెళ్తున్నావు?" అంటే "ఏదైనా పని చూచుకోడానికి" అన్నాడు- నువ్వుకూడా ఏదైనా పని చూచుకోవాలా మావయ్యా?

మా॥ నేనేకాదు - అందరూ

అ॥ అఁహాఁ అలా పనికోసం వెతుక్కుంటూ తిరుగుతుంటే ఎంతబాగుంటుంది.

మా॥ వెతికినా దొరకదనుకో – అప్పుడు ?

అ॥ అప్పుడింకా బాగుంటుంది – ఇంకా తిరగొచ్చు... ఆమనిషి మెల్లగా నడుస్తూ ఆ సెలయేరు దగ్గరకు వెళ్ళి ఆగాడు– మూటవిప్పి చద్ది తిన్నాడు – మళ్ళి మూటకట్టి భుజాన పెట్టుకొని పంచె పైకిదోపి యేరుదాటి వెళ్లిపోయాడు ... నేనుకూడా సెలయేరు దగ్గరకు వెళ్ళి చద్ది తింటా నని అత్తనడిగాను

మా॥ మీఅత్త ఏమంది ?

అ॥ "నీకు జబ్బునయమైతే అక్కడకు తీసుకువెళ్తాను" అంది· నాకెప్పుడు బాగౌంతుంది మావఁయ్యా?

మా॥ త్వరలోనే బాబూ.

అ॥ నాకు నయమైన వెంటనే వెళ్ళిపోతాను.

మా॥ ఎక్కడికి ?

అ॥ ఎక్కడికా? ... చిన్న చిన్న సెలయేర్లు దాటుకుంటూ, నీటితో ఆడుకుంటూ ఎక్కడికో వెళ్లిపోతాను – ఏదైనా పనిచూచుకుంటూ దూరంగా వెళ్లిపోతాను మావఁయ్యా !

మా॥ సరిసరి ! ... మొదట నీ ఆరోగ్యం బాగుపడాలికదా ! అప్పుడు ...

అ॥ అప్పుడు నన్ను చదువు కొమ్మనవుగదూ !

మా॥ మరేం చేస్తావ్ బాబూ ?

అ॥ ఏమో, ఇప్పుడు చెప్పలేను – కాని తరువాత చెప్తాను –

మా॥ ఊఁ, బాగానేఉంది... నీవు మాత్రం కొత్తవాళ్ళను పిలిచి మాట్లాడకు సుమా !

అ॥ నాకు కొత్తవాళ్ళతో మాట్లాడడం మహాయిష్టం గూాఁయ్యా !

మా॥ వాళ్ళు నిన్నెత్తుకుపోతే ...

అ॥ భలే బాగుంటుంది! కాని నన్ను ఎవ్వరూ ఎప్పుడూ ఎత్తుకుపోలేదే! అంతా నన్నిక్కడే ఉండమంటారు.

మా॥ సరే, నేను వెళ్లాలి – నీవుమాత్రం బయటికి పోమాకు బాబూ ... ఏం పోతావా ?

అ॥ వెళ్ళను కాని కిటికీలోనుంచి రోడ్డువైపుకు చూస్తూ కూర్చుంటాను.

(మాధవ్ వెళ్ళును)

పాలమనిషి:– పెరుగోయ్! పెరుగు! మంచిపెరుగు!

అ॥ పాలమనిషీ!... ఏయ్! పాలమనిషీ!

పా॥ ఏం! పెరుగు కొంటావా!

అ॥ నాదగ్గిర డబ్బులేదే! ఎలాకొంటాను?

పా॥ భలేవాడివిలే!... మరెందుకుపిలిచావ్ ? అనవసరంగా ఆలస్యమైపోయింది!

అ॥ నేను నీతో వచ్చేద్దామని పిలిచాను

పా॥ నాతోనా ? ...

అ॥ అవును! ...దూరాన రోడ్డుమీదనుంచి నీకేక వింటుంటే నాకు యింట్లో వుండడం పిసుగెత్తుతుంది!

పా॥ (కలకిలాదికిదించి) నీవు ఇక్కడేంచేస్తున్నావ్ నాయనా?

అ॥ నేను బయటికి పోకూడదని డాక్టరు చెప్పాడు – అందుకని రోజంతా యిక్కడే కూర్చుంటున్నాను.

పా॥ అయ్యో! నీకేం జబ్బుచేసింది ?

అ॥ నాకు తెలియదు' నేను చదువుకోలేదుగా – నువ్విక్కడి నుంచి వస్తున్నావ్ పాలమనిషీ ?

పా॥ మా ఊరినుంచి !

అ॥ మీ ఊరు ఇక్కడికి చాలా దూరమా ?

పా॥ పాంలీనది పక్కనే – పాంచ్ మురా కొండలకు దిగువ వుంది.

అ॥ పాంలీనది పక్కనే – పాంచ్మురా కొండలా – భలే : నేను మీ ఊరు చూచే ఉంటాను కాని ఎప్పుడో జ్ఞాపకం లేదు.

పా॥ మా ఊరు చూచావన్నమాట.

అ॥ ఏమో ! చూచినట్లే జ్ఞాపకం. మీ ఊరు రోడ్డుపక్కనే పెద్ద పెద్ద చెట్లక్రింద ఉంటుంది కదూ !

పా॥ అవును.

అ॥ కొండలమీద పశువులను మేపుతుంటారు కదూ!

పా॥ అవునవును - మేపుతుంటారు.

అ॥ మరీ! ... మీ ఊరి స్త్రీలు ఎర్రటిచీరెలు కట్టుకొని బిందెలతో నదిలో నీరునింపుకొని పోతుంటారుకదూ!

పా॥ నిజమే, ... కాని అందరూ ఎర్రటిచీరలే కట్టుకోరు - అయితే మా ఊరు ఎప్పుడో చూచే ఉంటావు.

అ॥ లేదు - నేనెప్పుడూ అక్కడికి పోలేదు - నేను బయటికి పోవచ్చునని డాక్టరు చెప్పినరోజునే నన్ను మీ ఊరు తీసుకుపోతావా?

పా॥ సంతోషంగా తీసుకువెళ్తాను -

అ॥ నీలాగా కర్రిభుజాన్న పెట్టుకొని నడవడమంటే నాకిష్టం - నాకు పెరుగమ్మడం నేర్పుతావా?

పా॥ నీవు పెరుగమ్మడ మెందుకు నాయనా! బాగా చదువు కొందువుగాని.

అ॥ వద్దు, నాకు చదువువద్దు. ఆ పెద్దమర్రిప్రక్కనే రోడ్డుమీద పోతూ యింటింటికి పెరుగమ్ముతూ ... ఆహా! ... పెరుగోయ్! పెరుగు! మంచిపెరుగు! "అని నువ్వు కేకేస్తావే... ఆ కేక నాకు నేర్పుతావా?

పా॥ అదేం పిచ్చికోర్కె నాయనా!

అ॥ చెట్లమధ్యగావున్న ఆరోడ్డు మలుపులోనుంచి నీ కేక

• వింటున్నా, ఆకాశంలో పక్షులపాటలు వింటున్నా నాకు మహా ఆనందంగా ఉంటుంది.

పా॥ కొంచెం పెరుగు తిను నాయనా !

అ॥ నాదగ్గిర డబ్బులేదుగా.

పా॥ డబ్బూవద్దు - ఏమీ వద్దు - నీవు కొంచెం తీసుకుంటే నేను సంతోషిస్తాను.

అ॥ పాపం! నీకు ఆలస్యం అయిందనుకుంటాను.

పా॥ ఏమీ కాలేదు - నీవు నాకు సంతోషంగా పెరుగమ్ముకోవడ మెలాగో నేర్పావు నాయన! మళ్లీ వస్తాను,

(వెళ్ళును)

అ॥ పెరుగోయ్! పెరుగు! మంచిపెరుగు! షాంలీనది - పాంచ్‌మురాకొండలు ... ఆ ఊళ్ళో స్త్రీలు ప్రొద్దున్నే ఆవుపాలు తీయడం ... సాయంత్రానికి పాలను పెరుగుగా మార్చడం ... ఆహా! అవన్నీ చూడాలి ... గస్తీమనిషి పోతున్నాడే... ఏయ్! గస్తీమనిషీ! ... ఒకసారి ఇలారా! ...

గస్తీమనిషి:- ఏమిటూ అరుపు - నన్ను చూస్తే భయంగా లేదూ!

అ॥ నాకెందుకు భయం?

గ॥ నేను నిన్ను తీసుకువెళ్ళిపోతే...

అ॥ ఎక్కడికి?...దూరంగా ఉన్న ఆ కొండల అవతలకేనా?

గ॥ రాజుగారి దగ్గరకు తీసుకువెళ్తేనో...

అ॥ రాజుగారి దగ్గరకా - నిజంగా తీసుకువెళ్తావా ? కాని డాక్టరు నన్ను బయటికి పోనివ్వడం లేదుగా! నన్నెవ్వరూ బయటికి తీసుకువెళ్ళరు- నేనెప్పుడూ యిక్కడే ఉండాలి!

గ॥ పాపం!...అందుకే నీమొఖం పాలిపోయింది.

అ॥ ఆఁ! నువ్వు కచ్చేరిగంట మోగించావా ఇప్పుడు?

గ॥ టైము కాలేదుగా!

అ॥ అరే! కొందరు టైము కాలేదంటారు - మరికొందరు టైం అయిపోయిందని ఆదుర్దా పడుతుంటారు ... నువ్వు గంట మోగిస్తే టైమవుతుందిలే -

గ॥ అబ్బే! అలావీలులేదు! టైమయితేనే నేను గంటలు కొడతాను -

అ॥ గంట ఎప్పుడూ మ్రోగిస్తుంటే బాగుంటుంది ... మధ్యాహ్నం భోజనాలుకాగానే మామయ్యా పనికిపోతాడు- అత్త రామాయణం చదువుకుంటూ నిద్రపోతుంది - మామకక్క దొడ్లో గోడనీడలో పండుకుంటుందే ... అప్పుడుకదూ ... గంటకొట్టేది! ... అయితే గంట ఎందుకు మోగిస్తారు ?

గ॥ "కాలం గడిచిపోతుందే కాని ఎవ్వరికోసం ఆగదు" అని ప్రజల్ని హెచ్చరించడానికి.

అ॥ ఎక్కడికి పోతున్నాది ?

గ॥ అది ఎవ్వరికీ తెలియదు!

అ॥ ఎవ్వరికీ తెలియనిచోటికి పోతుందున్నమాట ... ఆహా !
కాలంతోపాటు నేనుకూడా అక్కడికి పోగలిగితేనా.

గ॥ ఏదో ఒకరోజున మనమంతా అక్కడికి పొయ్యేవాళ్ళమే.

అ॥ నేను కూడానా?

గ॥ ఆ! నీవూ, నేనూ, అందరం.

అ॥ మరీ, డాక్టరు నన్ను పోనివ్వడుగా.

గ॥ ఏదో ఒకరోజున డాక్టరే నిన్ను తీసుకుపోవచ్చు.

అ॥ డాక్టరా! అతని సంగతి నీకు తెలియదు. నన్నెప్పుడూ
యిక్కడే ఉంచుతాడు –

గ॥ అతనికంటె గొప్ప డాక్టరొకడు వచ్చి నీకు స్వేచ్ఛ
యిస్తాడు.

అ॥ ఆ గొప్పడాక్టరెప్పుడు వస్తాడు?... నేనిక్కడ ఒక్క క్షణం
కూడా ఉండలేను.

గ॥ ఛా, అవేం మాటలు.

అ॥ నీకేం తెలుస్తుంది బాధ! ... వాళ్ళు నన్నెక్కడ కూర్చో
బెట్టారో అక్కడే కూర్చున్నాను – కదలలేను ...
నీ గంట వింటుంటే హాయిగా ఉంటుందికదూ.

గ॥ అవును.

అ॥ సరేగాని; ఎదురుగా జెండా ఎగురుతున్న ఆ పెద్ద యిం
టోకి జనం ఎప్పుడూ వస్తూ పోతూ ఉంటారెందుకు?

గ॥ ఖు : అదా. అది మన కొత్త తపాలా ఆఫీసు. . .

అ॥ తపాలా ఆఫీసా! ఎవరిది ?

గ॥ ఎవరిదేమిటి, రాజుగారిది.

అ॥ రాజుగారినుంచి యిక్కడికి ఉత్తరాలు వస్తాయా ?

గ॥ అవును : ఎప్పుడన్నా నీకుకూడా ఒక ఉత్తరం రావచ్చు.

అ॥ నాకా! నేను చిన్నపిల్లవాణ్ణికదూ!

గ॥ రాజుగారు చిన్నపిల్లలకి చిన్న ఉత్తరాలు పంపుతారు.

అ॥ భలే! భలే! రాజుగారు నాకెప్పుడో ఒకప్పుడు ఉత్తరం రాస్తారని నీకెలా తెలుసు ?

గ॥ అందుకు కాకపోతే మెరుస్తున్న జెండాకట్టి తపాలా ఆఫీసు మీయింటికెదురుగా ఎందుకు పెడతారు?

అ॥ నాకువచ్చే ఉత్తరాన్ని ఎవరు తెచ్చిస్తారు?

గ॥ రాజుగారికి చాలమంది తపాలా బంట్రోతు లున్నారు. రొమ్ములమీద పట్టీలు తగిలించుకొని పోతుంటారే... వాళ్ళని చూడలేదూ ?

అ॥ వాళ్లెక్కడికి పోతుంటారు?

గ॥ ఊరంతా యింటింటికీ తిరుగుతారు.

అ॥ నేను పెద్దవాడినైతే రాజుగారి తపాలా బంట్రోతు నౌతాను.

గ॥ ఇంకానయం! ఎండనక, వాననక, కలవాళ్లు, లేనివాళ్లనే భేదంలేకుండా యింటింటికీ తిరగాలి ... చాల కష్ట మయిన పని ...

అ॥ అదే నాకిష్టం. ఎందుకు నవ్వుతావ్ ? ... నీపనిమాత్రం కష్టమయింది కాదూ! మధ్యాహ్నపు ఎండలో ఊరంతా ప్రశాంతంగావున్నా నీవు గంట మోగిస్తూనే ఉంటావు ... ఎప్పుడైనా నాకు అర్ధరాత్రి మెలకువవస్తే అప్పుడుకూడా నీవు గంట కొడుతూ నే వుంటావు.

క॥ అడుగో! గ్రామపెద్ద నే నిక్కడవుంటే బాగుండదు. నేను వెళ్ళాలి.

అ॥ గ్రామపెద్దా: ఎక్కడ ?

క॥ అడుగో - గొడుగు పట్టుకు వస్తున్నాడే...

అ॥ రాజుగారు ఆతణ్ణి గ్రామ పెద్దగా చేశాడా?

క॥ అబ్బే! అదేమీకాదు. అందరూ తననుచూచి భయపడాలనుకుంటాడు - మనుష్యుల్ని ఏడిపించడమంటే వాడికి మహాసరదా. నేనిక్కడ ఉండడం మంచిది కాదు - రేపు వచ్చి ఊరు విషయాలు చెబుతానులే, (వెళ్ళును)

అ॥ రాజుగారినుంచి ప్రతిరోజూ ఉత్తరం వస్తే బాగుంటుంది, కిటికీదగ్గర కూర్చొని చదువుకుంటాను. అరే! నాకు చదువు రాదుగా! ... అత్త రామాయణం చదువుతుంది - ఆమెకు తెలుస్తుంది ... పోనీలే! ఎవ్వరూ చదవకపోతే జాగ్రత్తగా దాచిపెట్టుకొని పెద్దయినతరువాత చదువుకుంటాను ... తపాలాబం

కోపిష్టి నన్నురుగుండకపోతే ఏంచేయాలి ? ... నీవు గాజుపెద్దవుకదూ ! ఒకసారిలా వస్తావా?

గాజుపెద్ద : ఎవరా కేకలు రోడ్డుమీదికి ? ... నివేనా ! కూర్చుంటా.

అ॥ నీవు గాజుపెద్దవుకదా, అందరూ నిన్నెరిగుంటారుకదూ!

గా॥ (సంతోషంతో) ఔనౌను. అందరూ ఎరుగుంటారు - ఎరుగుండాలికూడా.

అ॥ రాజుగారి తపాలాబంట్రోతులు నీమాట వింటారా ?

గా॥ ఓ! తప్పకుండా వింటారు.

అ॥ ఈ కిటికీదగ్గర కూర్చుండే అబ్బాయి అమల్ అని వాళ్ళతో చెపుతావా ?

గా॥ ఎందుకు ?

అ॥ నాకు ఉత్తరం వస్తుందేమోనని.

గా॥ నీకా ! నీకెవరు వ్రాస్తారు ?

అ॥ రాజుగారు వ్రాస్తే?...

గా॥ ఆఁ! హాఁ! నీవేం సామాన్యుడుగా లేవే. అవునులే. రాజుగారు నీ ప్రాణస్నేహితులుకదూ ... అందులో నిన్ను చూచి చాన్నాళ్ళయిందా - వ్రాస్తార్లే ... రేపటిదాకా ఆగు... వస్తుందిలే ఉత్తరం.

అ॥ ఏమిటి అలా మాట్లాడుతున్నావ్ ? నీకు కోపం వచ్చిందా ?

గా॥ ఆఁ! ఆఁ! నాకు కోపం వచ్చింది. మాధవ్ ఇప్పు డెక్కడలే... రాజులూ మహారాజులూకూడా... ఏదీ యీమధ్య నా కెక్కడా కనబడలేదే ... కనబడితే చెబుతాను ... ఆఁ! అబ్బాయ్! రాజుగారి ఉత్తరం పంపిస్తానులే!

అ॥ దానికోసం నువ్వు కష్టపడమాకులే–

గా॥ అబ్బే! నాకేంకష్టం! రాజుగారికి నిమ్మళ్ళి గురించి చెపుతాను – వెంటనే వాని సేవకుడు మీ సంగతి కనుక్కోడానికి వస్తాడు – మాధవ్ ఇప్పుడెక్కడలే... ఒకసారి రాజుగారు వింటేగాని...(వెళ్లును)

అ॥ ఎవరా పోయేది? ఆహా! నీ పాదాలెంత ముచ్చటగా ఉన్నాయ్– కొంచెంసేపు ఇక్కడ ఉండిపోరాదూ!

(ప్రవేశం సుధ)

సుధ: ఒక్క క్షణంకూడా ఆగడానికి వీల్లేదు– ఇప్పటికే ఆల స్యం అయింది–

అ॥ నీకిక్కడ ఆగడానికి యిష్టంలేదు– నాకిక్కడ ఉండడా నికే యిష్టంలేదు–

సు॥ ఆలశ్యమౌతూంది...అలా వున్నావేం?

అ॥ నాకు తెలియదు– డాక్టరు నన్ను బయటికి పోవద్దన్నాడు

సు॥ డాక్టర్ చెప్పాడా! అయితే పోమాకు– పెద్దవాళ్ళ మాట వినకపోతే బాగుండదు– ఎప్పుడూ అలా బయ

టికి చూస్తూ కూర్చుంటే నీకు విసుగు పుడుతుంది– ఆ కిటికీ మూసేస్తానుండు–

ఆ॥ వద్దు– వద్దు– ఇదొక్కటితప్ప అన్నీ మూసేఉన్నాయ్! అది సరేగాని... నీ వెవరో చెప్తావా ?

సు॥ నా పేరు సుధ–

ఆ॥ ఏ సుధ ?

సు॥ తెలియదూ! పూలమనిషి కూతుర్ని–

ఆ॥ ఏం చేస్తుంటావ్ ?

సు॥ పూవు లేరుకుంటాను–

ఆ॥ పూవు లేరుకుంటావా! అందుకనే నీ పాదాలు, నీ నడక అంత బాగున్నయ్– నేనుకూడా బయటికి పోగలిగితేనా ... ఎత్తయిన చెట్లుకూడా ఎక్కి పూలు కోస్తాను–

సు॥ నిజమేనా!...మరి...పూలనిగురించి నాకు తెలిసిన వన్నీ తెలుసా నీకు ?

ఆ॥ ఓ! చంపా – ఏడుగురు సోదరుల కథకూడా తెలుసు నాకు! నన్ను బయటికి పోనిస్తేనా ... నీకు దారి కూడా తెలియని దట్టమైన అడవుల్లోకి పోయి గుబురైన చెట్లెక్కుతాను... నేను చంపానైతే నువ్వు నా సోదరి పగల్ అవుతావా ?

సు॥ నివ్వొట్టి అమాయకుడివి, నేను పూలమ్మే శశికూతురు సుధాని అయితే పగల్ నెలాఅవుతాను! ... నేను

• రోజూ చాలా దండలు కట్టాలి! నీ మాదిరిగా యిక్కడ కూర్చుంటే...!

అ॥ మరి రోజంతా ఏంచేస్తావ్ ?

సు॥ మా పెంపుడు పిల్లితో ఆడుకుంటాను ... అయ్యో! ఆలశ్యమైపోయింది- ఇంకా ఇక్కడేవుంటే ఒక్కపువ్వు కూడా దొరకదు-

అ॥ నువ్వు ఇంకొంచెం సేపు ఉండాలనివుంది నాకు!

సు॥ ఇంకానయం!... నువ్వు మంచివాడివికాని...ఇక్కడే కదలకుండా కూర్చో... నేను పూవులేరుకొని మళ్ళీ వచ్చి మాట్లాడుతాను-

అ॥ నాకొక పువ్విస్తావా ?

సు॥ డబ్బులిస్తే...

అ॥ నేను పెద్దవాడినయి యేదైనా పని చూచుకోడానికి ఆ సెలయేరు దాటి వెళ్ళిపోతానే...అప్పుడిస్తాను...!

సు॥ సరేలే-

అ॥ పువ్వులేరుకొని మళ్ళీవస్తావా ?

సు॥ వస్తానుగా!

అ॥ తప్పకుండా...?

సు॥ తప్పకుండా వస్తాను

అ॥ నాపేరు అమల్! నన్ను మర్చిపోవుగా-

సు॥ నిన్నెప్పుడూ మర్చిపోను (వెళ్ళును).

(ప్రవేశం - పిల్లలు)

అ॥ ఏయ్! అబ్బాయిలూ- మీరంతా ఎక్కడకు పోతున్నారు? కొంచెంసేపిక్కడ ఆగుతారా ?

మొదటిపిల్లవాడు : ఆడుకోడానికి పోతున్నాం-

అ॥ ఏంఆట ఆడుకుంటారు ?

మొ॥ పొలందున్నే ఆట ఆడుకుంటాం-

రెండవపిల్లవాడు : (ఒక కర్రచూపుతూ) ఇది నాగలి-

మూడవపిల్లవాడు : మేమిద్దరం ఎద్దులం-

అ॥ మీరు రోజంతా ఆడుకుంటారా ?

పిల్లలు : ఆ !

అ॥ సాయంత్రం కాగానే నదివొడ్డునే నడిచి యింటికి పోతారుకదూ?

మొదటిపిల్లవాడు : అవును

అ॥ మీరింటికి పోయేటప్పుడు యీదారినే పోతారా?

రెం॥ మాతో రారాదూ- ఆడుకుందాం-

అ॥ డాక్టరు నన్ను బయటికి పోవద్దన్నాడు-

మొ॥ డాక్టరు పోవద్దంటే మానేస్తావేంటి! సరేలే- ఆలస్యమౌతుంది- మేము పోతాం-

అ॥ పోమాకండి- ఈ కిటికీకి దగ్గరగా రోడ్డుమీద ఆడుకోరాదూ? నేను చూస్తుంటాను-

మొ॥ ఇక్కడేం ఆడుకుంటాం?

అ॥ ఇదిగో! నా బొమ్మలు చూడండి- చాలా వున్నాయ్-
నేనొక్కడినే ఆడుకోలేను... అవన్నీ పనికిరాకుండా
పోతున్నాయ్... వాటిని మీరు తీసుకోండి-

రెం॥ భలేభలే బొమ్మలున్నాయే- ఇది ఓడ- ఇది జటాయి
బొమ్మ... ఇది సిపాయిబొమ్మకదూ... మరి ఇవన్నీ
మేం తీసుకుంటె నువ్వేమీ అనుకోవూ!

అ॥ తీసుకోండి ... ఏమీ అనుకోను...

మూ॥ మళ్లీ తీసుకుంటావా?

అ॥ ఊఁహూఁ! తీసుకోను-

మొ॥ ఇవిపోతే మీవాళ్లు తిట్టరూ?

అ॥ ఎవ్వరూ తిట్టరు- వీటితో ప్రతిరోజూ కొంచెంసేపు
మా యింటిముందు ఆడుతూ వుంటారా? ఇవి పాడై
పోతే ఇంకా కొత్తబొమ్మలుకూడా కొనిస్తాను-

మొ॥ ఓ! తప్పకుండ ఆడతాం, సిపాయి బొమ్మల్ని వరసనే
నిలబెట్టి యుద్ధంఆట ఆడుకొంటాం... మరి ... తుపాకీ
ఏదీ?... ఆఁ! ఇదిగో ఇది పనికొస్తుందిలే ... అదేంటి?
అప్పుడే నిద్రపోతున్నావ్?

అ॥ నాకు నిద్రవస్తున్నట్లుంది - అదేంటో అప్పుడప్పుడు నా
కిలాగే మత్తుగా ఉంటుంది ... అబ్బ ... చాలసేప
ట్నుంచి కూర్చున్నాను... నడుం నొప్పిగా ఉంది-

మొ॥ ఇప్పుడు మధ్యాహ్నమేగా అయింది. ఇప్పుడు నిద్రెలా వస్తుంది. అదిగో... గంటలు ... కచ్చేరీలో గంటలు కొడుతున్నారు.

అ॥ అవును... గంటలు... అవి వింటుంటే నిద్ర వస్తూంది.

రెం॥ అయితే మేం పోతాం. రేప్రొద్దున్నే మళ్లీ వస్తాంలే.

అ॥ ఒక్కమాట. మీ రెప్పుడూ బయట తిరుగుతుంటారు కదా! రాజుగారి తపాలాబంట్రోతుల్ని ఎరిగున్నారా

మూ॥ ఎరుగున్నాం.

అ॥ ఎవరువాళ్లు? వాళ్ళపేర్లు చెప్పండి.

మొ॥ బాదల్ ఒకడు.

రెం॥ శరత్ ఒకడు.

మూ॥ ఇంకా చాలామంది ఉన్నారు.

అ॥ నాకు ఉత్తరం వస్తే యివ్వటానికి వాళ్లు నన్ను కనుక్కుంటారా?

మొ॥ ఉత్తరంమీద నీపేరుంటే తప్పక కనుక్కుంటారు.

అ॥ రేపొద్దున్న మీ రెక్కడికి వచ్చేటప్పుడు ఒకణ్ణి తీసుకురండి... నన్ను చూస్తాడు.

పిల్లలు : అలాగేలే.

(తెరవాలును)

## రెండవ అంకము

(అమల్ పక్కమీద ఉంటాడు)

అమల్ : ఈరోజు నేను కిటికీ దగ్గరకుకూడా పోకూడదా మావయ్యా ?

మాధవ్ : పోకూడదు బాబూ— ఎప్పుడూ అక్కడే కూర్చొని నీవు మరీ పాడైపోతున్నావు.

అ॥ అక్కడ కూర్చుంటేనే నాకు హాయిగా ఉంటుంది—

మా॥ వద్దు! అక్కడకూర్చుంటే ఎప్పుడూ ఎవరితోనో ఒక రితో వాగుతూనే ఉంటావ్— చూడు, నీ మొఖం ఎలా పాలిపోయిందో ?

అ॥ నేనక్కడ లేకపోతే సాధువు చూడకుండా వెళ్లిపోతాడేమో ?

మా॥ సాధువెవరు ?

అ॥ అతడు తిరిగిన దేశాల వింతలన్నీ నాకు చెపుతుంటాడు— ఎప్పుడూ వినాలనిపిస్తుంది...వచ్చే వేళయింది ...మావయ్యా ... నాతో కొద్దిసేపు మాట్లాడనీ పొమ్మనవూ!

(వైద్యుని ప్రవేశం సాధువు వేషంలో. తాత)

అ॥ మాటలోనే వచ్చావ్— రా సాధూ! నా పక్కనే కూర్చో—

మా॥ నీవు ...

సాధువు॥ ఆఁ! ఆఁ! నేనే సాధువును-

అ॥ ఈసారి ఎక్కడికి వెళ్లావ్ సాధూ ?

సా॥ చిలుకలదీవికి వెళ్లి యిప్పుడే వస్తున్నాను-

మా॥ ఏం- ఆశ్చర్యంగా ఉందా? హుఁ! నే నెక్కడికి వెళ్లాలనుకుంటే అక్కడికల్లా వెళ్తాను-

అ॥ నీకెంత ఆనందంగా ఉంటుందో... సాధూ ... నాకు బాగైన వెంటనే నీవెంట తీసుకువెళ్తానన్నావు కదూ ...జ్ఞాపకముందా ?

సా॥ ఓ! తప్పకుండా తీసుకవెళతాను - అంతేకాదు - సముద్రాలూ, కొండలూ, అడవులూ ఏవీ నీదారికి అడ్డు రాకుండా ఉండే రహస్యాలుకూడా చెపుతాను-

మా॥ ఏమిటీ? ఈ డాబుకబుర్లు-

సా॥ నిజం అమల్ బాబూ,నాదారికేవీ అడ్డురావు డాక్టరుగారూ మావయ్యా ఒకసారి నిన్ను నా వెంటరానిస్తే-

అ॥ వద్దు- డాక్టరుకు చెప్పొద్దులే మావయ్యా- జబ్బు నయమయ్యేవరకూ నేనల్లాగే పడుకుంటాను-నయమై పోగానే సాధువు వెంట వెళ్లిపోతాను- అప్పుడు సముద్రాలూ, కొండలూ ఏవీ నాకడ్డురావు-

మా॥ వెళ్లిపోతాను- వెళ్లిపోతాను అనమాకు బాబూ- వినలేకుండా వున్నాను-

అ॥ చిలకలదీవి ఎలాఉంటుందో చెప్పు సాధూ!

సా॥ చాలాచాలా వింతలున్నాయిలే–అక్కడ అన్నీ పక్షులే– మనుష్యులూ గినుష్యులూ ఎవ్వరూ ఉండరు– అవి నడసడం మాట్లాడడం లేనేలేదు – ఎంతసేపూ స్వేచ్ఛగా ఎగురుతూ హాయిగా పాడుతూ ఉంటాయ్–

అ॥ అహా!...ఆదీవి సముద్రంలోనే వుందా?

సా॥ అవును

అ॥ మరి...అక్కడ పచ్చటి కొండలున్నాయా ?

సా॥ ఓ! చాలా ఉన్నాయ్! ... సంధ్యవేళ ఎర్రగా వుండే పడమటిదిక్కుకు పక్షులన్నీ పచ్చటి రెక్కల్ని ఊపుకుంటూ గూళ్ళకి ఎగిరిపోతుంటే...ఆ సౌందర్యం ఏం చెప్పమంటావ్ బాబూ!

అ॥ అక్కడ జలపాతా లున్నాయా ?

సా॥ కొండలుంటే జలపాతాల్లేకుండా ఉంటాయ్యా, ముత్యాల ధారల్లాగా ప్రవహించే జలపాతాల్లోనుంచి సంగీతం వినిపిస్తుంది. బాబూ... ఏ డాక్టరూ వాటిని ఒక్క క్షణంకూడా ఆపలేదు ... పక్షులన్నీ నన్ను చూచి మామూలు మనిషేలే – రెక్కలులేని జీవం – అనుకున్నారో యేమో ... నాతో యేమి పనిలేనట్లు నా దగ్గరకే రాలేదుగాని లేకపోతేనా...వాటి గూళ్ల దగ్గరే ఒక మంచెకట్టుకొని సముద్రపు అలల్ని లెక్క పెడుతూ హాయిగా కాలం గడిపేవాడిని–

అ॥ ఆహా! నేనుకూడా పక్షినైతే...

సా॥ అయితే... నీవు పెద్దవాడివైన తరువాత పాలమనిషి లాగా పెరుగమ్ముతా నన్నావటగా? ... పక్షిలాగా బ్రతకదలుచుకొన్నవాడికి యిలాంటి వ్యవహారం పనికి రాదు–

మా॥ మీ యిద్దరిగొడవ వింటుంటే నాకు పిచ్చెత్తేట్లుంది నేను పోతాను–

అ॥ పాలమనిషి వెళ్ళిపోయాడా మావయ్యా?

మా॥ ఆఁ! పోక మీలాగ కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటాడేం ... పెరుగిచ్చాడు ... వాళ్ళమ్మాయి పెళ్ళట ... త్వరగా పోవాలని పోయాడు–

అ॥ వాళ్ళ చిన్నమ్మాయిని నాకు పెళ్లి చేస్తానన్నాడు ... చెవులకు చక్కటి నత్తుల్లెలుంటాయి– ఎర్రటి చీర కట్టుకుంది – ప్రొద్దున్నే ఆవుపాలు పితికి కాచి వేడేడి పాలతో నాకు అన్నం పెడుతుంది – చీకటి పడగానే నా ప్రక్కనే కూర్చొని చంపా – సోదరుల కథ చెపుతుంది.

సా॥ ఇదంతా వింటుంటే సాధువునైన నాకే తల తిరుగు తుంది – సరేగాని పెళ్లిని గురించి బెడద పెట్టుకోమాకు – నీవు పెళ్ళిచేసుకోవాలనుకుంటే పిల్లలకేమీ కొదువ లేదులే.

మా॥ అబ్బబ్బ ఇంక నే నుండలేను (వెళ్ళును)

అ॥ సాధూ! మావయ్య వెళ్లిపోయాడు. రాజుగారు తపాలా ఆఫీసుకు నాకు ఉత్తరం పంపరా?

సా॥ ఈపాటికి ఉత్తరం వస్తుంటుంది.

అ॥ వస్తుంటుందా... ఇప్పు డెక్కడుంటుందో? ... వర్షం వెలిసిన తరువాత ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడు ఆ అడవిలో గుబురుగా ఉన్న చెట్లమధ్య రోడ్డు చాల బాగుంటుంది ... బహుశా అక్కడ ఉందేమో ?

సా॥ అవునవును- నీకప్పుడే తెలిసింది-

అ॥ అవును.

సా॥ నీకెలా తెలిసింది ?

అ॥ ఏమో! నా కెప్పుడో చూచినట్లు జ్ఞాపకం - ఎప్పుడో చెప్పలేను- నువు చెబుతావా సాధూ... నాకు అంతా కనబడుతూంది- రాజుగారి తపాలా బంట్రోతు ఎడమ చేతితో దీపం పట్టుగొని వీపుమీద ఉత్తరాలసంచితో కొండవక్కనే పారుతూ వున్న సెలయేరు ఒడ్డునే పగలనకా, రాత్రనకా నడిచి నడిచి వస్తుంటాడు ... అక్కడొక చెరకుతోట ఉంది - చెఱుకుగడలమధ్యకు వెళ్ళి మాయ మౌతాడు. ఆ తరువాత విశాలమైన మైదానం ...అక్క డెవ్వరూ ఉండరు... పక్షులు మాత్రమే పాడుకుంటుంటాయ్... ఆ మైదానంలోనుంచి

ఒంటరిగా నడిచి వస్తుంటాడు... అతడు దగ్గరకు వచ్చే కొలదీ నా హృదయం ఆనందంతో గంతులేస్తుంది—

సా॥ అవును బాబూ—

అ॥ ఈ తపాలా ఆఫీసు పెట్టిన రాజుగారిని నువ్వెరిగు న్నావా సాధూ?

సా॥ ఎరుగున్నాను — నేను ప్రతిరోజు రాజుగారి దగ్గరకు పోతాను—

అ॥ నాకు నయమవగానే రాజుగారి దగ్గిరకెళ్లి వరమడుగు తాను. ఏమంటావ్ సాధూ?

సా॥ నీవడగ నవసరం లేదు — రాజుగారే స్వయంగా నీ కిస్తారు బాబూ.

అ॥ అబ్బే! అలాకాదు. రాజుగారి దగ్గిరకెళ్లి "జయము — జయము — మహారాజా" అంటాను— తరువాత వర మడుగుతాను. ఏం సాధూ అలా బాగుండదూ?

సా॥ చాలా బాగుంటుంది. నీవు నాతోకూడా రా... ఐతే రాజుగార్ని యేమడుగుతావ్ బాబూ?

అ॥ నేనెప్పుడూ ఇంటిదగ్గర ఉండకుండా ఉండేందుకు... "ఇంటింటికి తిరిగి ఉత్తరాలిస్తాను — మీ తపాలా బంట్రోతుని చేయండి" అని అడుగుతాను.

సా॥ ఇంటిదగ్గరే ఉంటే యేం కష్టం బాబూ?

అ॥ కష్టం ఏమీలేదు...రోజంతా యిక్కడ కూర్చుండడం విసుగ్గా ఉంది...కాని యిక్కడ రాజుగారి తపాలా ఆఫీసు పెట్టినప్పటినుంచి ఇక్కడే ఉండాలనిపిస్తుంది - ఏదో ఒకరోజున రాజుగారి ఉత్తరంవస్తే విసుగంతా మర్చిపోతాను... రాజుగారి ఉత్తరంలో ఏముంటుంది సాధూ ?

సా॥ నీ పేరుంటే చాలదూ?

(ప్రవేశం మాధవ్)

మా॥ మీరిద్దరూ కలసి నన్నేమన్నా చిక్కుల్లో పెట్టదలచు కొన్నారా ?

సా॥ ఏమిటి సంగతి ?

మా॥ మీ యిద్దరికి ఉత్తరాలు పంపించడానికే రాజుగారిక్కడ తపాలాఆఫీసు పెట్టారని గోలచేస్తున్నారటగా.

సా॥ ఆఁ!...అయితే...

మా॥ పంచానన్ లేడూ...మన గ్రామపెద్ద... అతడు పోయి రాజుగారికి చెప్పాడు.

సా॥ అన్నివిషయాలు రాజుగారికి తెలుస్తాయ్. తప్పదు.

మా॥ అందుకనే జాగ్రత్తగా వుండనవసరంలేదా అంటాను... అనవసరంగా రాజుగారి ఊసెందుకు... మీరు నన్ను నాశనం చేసేట్టున్నారు.

అ॥ రాజుగారికి కోపంవస్తుందా సాధూ?

సా॥ కోపమా... ఛా... నీలాంటి పసివాడిమీదా, నాబోటి సన్యాసిమీదా కోపగించుకొనేటంత తెలివితక్కువ వాడు కాదు రాజుగారు.

అ॥ ఎందుకనో నాకు ప్రొద్దుటినుంచి కళ్లు చీకట్లు కమ్ముతున్నాయ్ సాధూ. అంతా కలగావుంది ... ప్రశాంతంగా వుండాలని వుంది... నాకు మాట్లాడు తున్నట్లే లేదు- రాజుగారినుంచి ఉత్తరం రాదా? ... ఒకవేళ ఆకస్మాత్తుగా ఈగది మాయమైపోతే ...

సా॥ (అమల్‌కు విసురుతూ) ఉత్తరం ఈరోజు తప్పకుండా వస్తుంది బాబూ!

(ప్రవేశం డాక్టరు)

డాక్టరు॥ ఈరోజు నీకెలావుంది?

అ॥ చాలా సంతోషంగాఉంది డాక్టరుగారూ -

డా॥ (మాధవ్‌తో) అతని చిరునవ్వు చెడుని సూచిస్తుంది... చక్రిదన్ ఏమన్నాడంటే...

మా॥ దయచేసి చక్రిధన్ సంగతి వదలివేయండి- ఏం అవుతుందో చెప్పండి_

డా॥ ఎక్కువకాలం బ్రతకడనుకుంటాను... ఆఁ! తలుపులన్నీ మూసేయాలని చెప్పలేదూ...

మా॥ చాలాజాగ్రత్త తీసుకున్నాను- పిల్లవాడు బయటికి పోలేదు... తలుపులన్నీ మూసేసే ఉన్నాయ్!

డా॥ ఇవ్వాళ వాతావరణం బాగలేదు...ఆఁ!...ఇదిగో!...
ఈ పక్కగా వస్తున్న గాలి చాల ప్రమాదకరమైంది-
ఆ తలుపు మూయాలి ... ఎవరైనా రావాలంటే
వెనక వేపు వాకిలిగుండా వస్తారు...ఈ కిటికీగూడా
మూసేయడం మంచిది- దీనిలోనుంచి వచ్చే సూర్య
కిరణాలు రోగిని నిద్రపోకుండా చేస్తాయ్-

మా॥ అనల్ కళ్లు మూసుకున్నాడు ... నిద్రపోతున్నా
డేమో...ఎక్కడివాడినో తెచ్చి నావాడిగా ప్రేమిం
చాను ... అతని ముఖం చూస్తే దక్కేలా లేడు
డాక్టరుగారూ...

డా॥ మీ గ్రామపెద్ద వస్తున్నాడే- ఎందుకీ గోలంతా? ...
నేను వెళ్తాను...ఆఁ! తలుపులు అవీ గట్టిగా మూసి
ఉంచాలి...వెంటనే మందు పంపుతాను ... బ్రతికే
రాతఉంటే దాంతో నయంకావచ్చు...

(డాక్టర్-మాధవ్ వెళ్లిపోతారు)

(ప్రవేశం - పంచానన్)

పంచానన్॥ ఆఁ!...

సా॥ ఉష్- మాట్లాడవద్దు-

అ॥ నేను నిద్రపోతున్నాననుకున్నావా సాధూ! లేదు ...
నాకన్నీ వినబడుతూనే ఉన్నాయ్...అమ్మా నాన్నా
నాప్రక్కనే కూర్చుని మాట్లాడుతున్నట్లుంది...

(ప్రవేశం - మాధవ్)

పం॥ ఓ! మాధవ్! నీవిప్పు డెక్కడలే...

మా॥ సామాన్యులం మాతో ఎగతాళెందుకు?

పం॥ మరి మీ అబ్బాయి రాజుగారినుంచి ఉత్తరంకోసం ఎదురుచూస్తున్నాడే-

మా॥ వట్టి అమాయకుడు

పం॥ లేదు- లేదు- రాజుగారికడ తపాలాఆఫీ సెందుకు పెట్టారంటావ్ మరి...ఉత్తరం వచ్చింది-

అ॥ (పైకిలేస్తూ) నిజమేనా...నిజమేనా...

పం॥ అబద్ధం ఎందుకు కావాలి ... నీవు రాజుగారికి ప్రాణ మిత్రుడవైతే ... ఇదుగో ఉత్తరం- (తెల్లకాగితం ముక్క చూపించి నవ్వుతూ) ఇదే వుత్తరం-

అ॥ ఎగతాళి చాలించు...నిజమేనా సాధూ?

సా॥ అవును బాబూ. ఇదే ఉత్తరం-

అ॥ దానిలో ఏమీ కనబడడం లేదే- ఉత్తరంలో ఏముంది

పం॥ "నేను త్వరలో వస్తున్నాను- రాజభోజనం బాగుండ లేదు- మంచి బియ్యమిప్పించి ఉంచు" అని వ్రాశారు- (నవ్వును)

మా॥ నీవు గ్రామ పెద్ద వయితే అయ్యావుకాని ప్రతిదానికి ఎగతాళేమిటి?

సా॥ ఎగతాళేమిటి ?...అన్ని గుండెలు కూడానా గ్రామ పెద్దకు !

మా॥ నీకుకూడా మతిపోయిందా ?

సా॥ నాకా...నాకు స్పష్టంగా కనిపిస్తుంది ... అమల్‌ని చూడ్డానికి రాజవైద్యునితో సహా రాజుగారు వస్తారని వ్రాశారు–

అ॥ సాధూ...సాధూ...అదిగో వస్తున్నారు... నీకు ధ్వని వినబడడం లేదూ ?

పం॥ (నవ్వుతూ) మతి చెడితేతప్ప...

అ॥ పంచానన్! నీకు నామీద కోపమేమో అనుకున్నాను, నువ్వు రాజుగారి ఉత్తరం తెస్తావనుకో లేదు – కాని తెచ్చావు– నీకు చాలా కృతజ్ఞుణ్ణి !

పం॥ కొంచెం కొంటెవాడైనా హృదయం మంచిది.

అ॥ పైమెంతవుతుంది... బాగా చీకటిపడినట్లుంది–నాకేమీ తెలియడం లేదు.

సా॥ కిటికీలన్ని మూసేసేవున్నాయ్. తెరుస్తానుండు.

(బయట చప్పుడు)

మా॥ ఎవరది?...ఏమిటాచప్పుడు?

బయటివ్యక్తి॥ తలుపు తెరవండి–

మా॥ పంచానన్! వాళ్లు దొంగలు కారుకదా!

పం॥ ఏయ్, ఎవరది– అడిగేది పంచానన్ ! గ్రామపెద్దను. బొత్తిగా భయంలేకుండా ఏమిటాగోల ? ... ఆఁ !

చూశావా! గోల ఆగిపోయింది! ... పరిచారకన్ అంటే ...

మా॥ (కిటికీలోనుంచి చూచి) గోల ఆగిపోయిందంటే ఆగిపోదూమరి. వాళ్లు తలుపు బద్దలుకొట్టారు!

(ప్రవేశం – రాజదూత)

రాజదూత॥ రాజుగారు రాత్రికి వస్తారు.

పం॥ అర్రరే!

అ॥ ఎన్నిగంటలకు వస్తారు?

రాజ॥ రెండవజాముననా

అ॥ గస్తీమనిషి కచేరిగంటలు కొడతాడే – అప్పుడేకదూ?

రాజ॥ అవును– అప్పుడే... రాజుగారు నిన్నుచూడ్డానికి రాజవైద్యుణ్ణి పంపించారు...

(ప్రవేశం–రాజవైద్యుడు)

రాజవైద్యుడు॥ ఇక్కడ ఇంత చీకటిగావుందేం? తలుపులన్నీ తెరవండి– (అమల్ శరీరం తడుముతూ) ఇప్పుడు నీ కెలావుంది బాబూ–

అ॥ హాయిగావుంది డాక్టరుగారూ! బాధంతాపోయింది... ఆహా!... ఎంత ఆనందంగా ఉంది!... ఇప్పుడు నాకు చీకట్లో మెరుస్తున్న నక్షత్రాలన్నీ కనబడుతున్నాయ్!

రాజ॥ రాజుగారు వచ్చినప్పుడు నీవు పక్కమీదనుంచి లేవగలవా?

అ॥ ఓ! లేస్తాను... నాకు ధృవనక్షత్రాన్ని చూపెట్టమని రాజుగార్ని అడుగుతాను... నేను చాలాసార్లు చూచి ఉంటానుకాని ఏదైందీ తెలియడంలేదు.

రాల॥ రాజుగారు నీకన్నీ చెబుతారు బాబూ! (మాధవ్‌తో) రాజుగారి రాకను ఏర్పాట్లు చెయ్యండి (గ్రామ పెద్దను చూపిస్తూ) ఇతడిక్కడ ఉండకూడదు.

అ॥ ఉండనివ్వండి డాక్టరుగారూ... అతడు స్నేహితుడు... అతనే నాకు రాజుగారి ఉత్తరాన్ని తెచ్చియిచ్చాడు.

రాజ॥ సరే బాబూ! నీ స్నేహితుడైతే ఉండవచ్చు.

మా॥ (అమల్ చెవిలో) రాజుగారు స్వయంగా వస్తున్నారు. నీవంటే చాలయిష్టం అనుకుంటాను... వారి నేదైనా కోరుకో బాబూ... మన పరిస్థితి నీకు తెలుసుగా.

అ॥ నాకు తెలుసు మావయ్యా! - నేనిదివరకే నిశ్చయించుకున్నాను-

మా॥ ఏమది బాబూ?

అ॥ దూరదూర ప్రదేశాలన్నీ తిరిగి అతని సందేశాన్ని ఇంటింటికీ అందించడానికి నన్నొక తపాలా బంట్రోతును చేయమని అడుగుతాను.

మా॥ అయ్యో. అదా!

అ॥ రాజుగారు వచ్చినప్పుడు మనమేమి చెయ్యాలి మావయ్యా?

రాజ॥ బియ్యపిండి!

అ॥ బియ్యప్పిండా! నువ్వు సరిగానే చెప్పావు పంచానన్! నాకు తెలియనివన్నీ నీకు తెలుసు-

పం॥ మీరు మాయింటికి కబురుచేస్తే రాజుగారికి పంపి...

రాజ॥ అవసరంలేదు– మీరంతా నిశ్శబ్దంగా ఉండండి ... అతనికి నిద్రవస్తుంది– నేనతని పక్కనే కూర్చుంటాను...దీపం ఆర్పేయండి ... నక్షత్రాల వెలుగు చాలు...ఆ! నిద్రపోతున్నాడు–

మా॥ (సాధువుతో) ఎందుకలా చేతులు ముడుచుకొని విగ్రహంలా నిలబడ్డావ్! నాకు మతిపోయింది...ఎందుకు దీపం ఆర్పేశారు ... నక్షత్రాలకాంతే చాలుతుందీ?

సా॥ నీకేమీ తెలియదు– నిశ్శబ్దంగా ఉండు.

(ప్రవేశం సుధ)

సుధ॥ అమల్!

రాజ॥ నిద్రపోతున్నాడు–

సుధ॥ అతనికోసం పువ్వులు తెచ్చాను– నేనతని చేతుల్లోనికి స్వయంగా యివ్వకూడదా?

రాజ॥ ఇవ్వవచ్చును–

సుధ॥ ఎప్పుడు మేల్కొంటాడు?

రాజ॥ రాజుగారు వచ్చి పిలిచినప్పుడు–

సుధ॥ అతని చెవిలో ఒక్కమాట చెప్తారా?

రాజ॥ ఏమని?

సుధ॥ సుధ నిన్ను మర్చిపోలేదని చెప్పండి–

( తెర )

సమాప్తము

కరణ్ ప్రెస్ - గుంటూరు